శ్రీ రామాయనమః

# శ్రీ రామనామ మహాత్మ్యము



విరచితము

శ్రీ ఆంధ్ర వాల్మీకి
వాసుదాస స్వామి



www.mohanpublications.com

శ్రీరామాయనమః

# శ్రీరామ నామమాహాత్మ్యము



వావిలికొలను సుబ్బారాయ
విరచితము



శ్రీశ్రీశ్రీ "ఆంధ్రవాల్మీకి"
శ్రీ వావిలికొలను సుబ్బరావు (వాసుదాస స్వామి)
శ్రీ రామసేవా కుటీరము, వాల్మీకి ఆశ్రమము (శృంగిశైలము),
ఒంటిమిట్ట, కడప జిల్లా.

www.mohanpublications.com

## పీఠిక

గుంటూరు మండలములోని నరసరావు పేఁటకు 6 మైళ్ళ దూరములో నొక చాగంటివారిపాళెమను చిన్న గ్రామము గలదు. అందలి జనులు విశేషము రైతులు. ఆలగనుల మహారత్నములవలె నితర మహాపట్టన ములందు నేందేని నొకరిద్దఱు నిక్క మైన భక్తులుందురుగాక. రత్నపూర్ణఖని యరుదు. ఈ గ్రామము పుట్టిన లగ్నము మహిమయో లేక భూమి విలక్షణ లక్షణమో యీ గ్రామమంతయు భక్తమయము. ఆబాలగోపాలము భక్తిశూన్యుఁ డీగ్రామము పొలిమేరలోపలఁగాననరాఁడు. ఈ గ్రామమునందలి స్త్రీ పురుషులను స్మరించినపు డంతము వ్రేపల్లెయు గోపికలు గోపాలురు స్మరణమునకు రాకపోరు. ముఖ్యైకాదశుల రుక్మాంగద రాజ్యమే. నామొగమెట్టిదో వీ రెవ్వరెఱుఁగని కాలములో శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణము కని భగవంతునకు మ–రా–శ్రీమధుర రంగయ్యగారితండ్రి సగమెకరాపొలము మరణశాసన మూలమున నిచ్చి మరణించెను. ఆనాఁటి నుండి వీరికి నాకుఁ బరిచయము గలదు. స్వస్థాన మని నేను వ్యర్థాభిమానము వహించియుండు కడపమహానగరమున నొంటిమిట్ట కోదండరామస్వాములవారి కైంకర్యమునకుఁ గాను బిచ్చ మెత్తఁగా రూ. 1500లకుఁ బట్టి యేర్పడి యందు నుదార స్వభావముగల పెద్దమనుష్యులు రూ1000ల వఱకు నిచ్చిరిగాని తక్కి నవారు వాగ్దానము చేసి 12/4 సంవత్సరమైనను నింకను నిచ్చుచునేయున్నారు. ఈ యధమర్ణులు జన్మాంతరమందయినస్వామి ఋణవిముక్తులు గాకపోరుగాని యిప్పుడు వీరు బిచ్చము పెట్ట కుండిన మానెఁ గుక్క ను బిగఁబట్టినఁ జాలమేలు. నేను స్వప్నమందును నెఱుఁగని దోషముల నామెడఁ గట్టక యూరక విడిచిన వీరు ధనసాహాయ్యము చేసినంత పుణ్యము. వీరిపేరు చెప్పుకొని మఱి యెందైన భిక్షించెదను. మిథ్యాభిశంసనోశతుల నింద్ర బ్రహ్మహత్యయందు నాలవపాలును, నా పాపసముచ్చయమును బంచుకొని యింద్రునకు నాకును నుపకారులైన వీరు నాకు వంద్యులే. చక్కె ర నెవరైనఁ బంచుకొని తిందురుగాని విషము నెవరు పంచుకొని భుజింతురు. ఇట్టి మహెూపకారము జన్మస్థానవాసులగుటచే స్వకీయాభిమానంబున వీరు గావించిరి గాక యితరు లిట్లు చేయఁగలరా?

తన మండలములోని తమయూరిలోని యనాది సుప్రసిద్ధ దేవాలయమునకు మా యొంటిమిట్ట మా పోతన యని ఊొమ్ములు గ్రుద్దుకొను కడపవారి గతి మతి స్థితి కృతి యిట్లుండ నెక్క డి యొంటిమిట్ట యెక్క డి చాగంటివారిపాళెము! నేను వీరి గ్రామమునకు రామభిక్షకై పోఁగా స్వహస్తముల రూ. 900లు, పరహస్తముల రూ. 600లు, రూ. 1500లు స్వామికై యర్పించిరి. అంతియకాదు. వారిపల్లెనుండి నడచి భజన చేయుచు స్వామిని దర్శింప లింగమ్మ శ్రీమతులు కృష్ణమ్మ – రామమ్మ – సీతమ్మలోనగు పెక్కు రు స్త్రీలును రంగారెడ్డి – మహానందిరెడ్డి యీ మొదలైన పురుషులును వచ్చిరి. వారప్పుడు నన్నడిగిన ప్రశ్నలకుత్తరమే యీ శ్రీరామనామ మాహాత్మ్యగ్రంథము. వీని వలననే వారిభక్తి శ్రద్ధలు విశదముకాఁగలదు. శ్రీసీతారామచంద్ర మూర్తులు వీరికి శాశ్వత సుఖైశ్వర్యములు ప్రసాదింతురుగాక.

**వాసుదాసుఁడు.**

www.mohanpublications.com

శ్రీ రామాయనమః

# శ్రీమదొంటిమిట్ట కోదండరామస్వామి నేనమః

# శ్రీరామ నామమాహాత్మ్యము

శ్రీక్షితిలుప్తధర్మమయి చేద్పడినన్ ఖలశిక్ష శిష్ట సం ।
రక్ష నొనర్పఁ బుట్టుచు ధరాస్థలి నన్న ప్రతిజ్ఞఁ
దీర్పఁగా । దక్షత మానవాకృతి నుదారతఁ దోఁ
చిన శౌరి ధర్మసం । రక్షకుఁ డొంటిమిట్ట రఘు
రాముఁడు ప్రోచుత భక్తకోటులన్.

సీ. ధర్మసంభృతి లోకశర్మం బొనర్చుట
  సతతసద్ధర్మ సంభృతిని దెలిపి
దూషిత ధర్మంబుఁ దూలఁబుచ్చుట నుగ్ర
  దూషిత ధర్మంబుఁ ద్రుంచి తెలిపి
శరణన్న వధ్యుఁ డౌ శత్రువునైనను
  గాచుట వాయన కథను దెలిపి
సౌశీల్యగరిమంబు శబరి నిషాదాధి
  పతిని మన్నించుట వలనఁ దెలిపి

తే. తన్ను నెవఁడేని నీవాఁడ నన్నమాత్ర
వానిఁ జేపట్టి విడువని వ్రతముఁ గొన్న
లలిత గుణహారి యేకశిలా విహారి
భక్తవారంబుఁ బ్రోచు నపారదయను.

కం. పతికిని బాసట యగుమతి
క్షితసుతయై వెతల నోర్చి శీలినుల పతి
వ్రతముం బోరి రక్షించిన
శ్రితజనమందార ప్రోచు శిష్టజనంబున్.

కం. నిక్కముగ ఘోర సంసృతిఁ
జిక్కులఁ బడ నొల్ల రేని స్నేహితులారా
దిక్కే వొక్కఁడ వంచును
గ్రక్కునఁ గొలువుండు రాముఁ గరుణా ధామున్.

శ్రీపతియు, నవాప్తసమస్త కాముఁడును, సమస్తకల్యాణ గుణ విశిష్టుఁడును, హేయగుణరహితుండును, సర్వస్వామియు, వత్సలుండును, శుశీలుండును, సులభుండును, సర్వజ్ఞుండును, సర్వశక్తియు, సకలేతర విలక్షణుండును, సత్యకాముఁడును, సత్యసంకల్పుఁడును, బరమకారుణికుండును, బరమోదారుండును. నమస్కారమాత్ర ప్రీతుండును నగు భగవంతుఁడు శ్రీమన్నారాయణుఁడు

శ్లో. "వైకుంఠేతు పరేలోకే, శ్రియాసార్థం జగత్పతిః
  ఆస్తే విష్ణు రచింత్యాత్మా, భక్తైర్భాగవతైస్సహ"

యన్నట్లు వైకుంఠమున శ్రీభూనీళాసహితుండై విరాజిల్లుచుఁ బ్రలయకాలంబున నిజాంశభూతులైన చేతనులు (జీవాత్మలు) నచేతనంబైన ప్రకృతితోఁడఁ గమసాలి మైనపుటుండ యందలి బంగారు రేణువులవలెఁ గలసి యచేతన ప్రాయులై పడియుంట చూచి

శ్లో. ఏవం సంసృతి చక్రస్థే, భ్రామ్యమాణే స్వ కర్మభిః
  జీవే దుఃఖాకులే విష్ణోః, కృపా కా ప్యజాయతే.

యన్నట్లు కృపచేఁ గరఁగిన మనస్సుగలవాఁడై వారిని సంసారమునుండి తరింపఁజేయ

శ్లో. విచిత్రా దేహ సంపత్తి, రీశ్వరాయ నివేదితుమ్
  పూర్వమేవ కృతా బ్రహ్మన్, హస్తపాదాది సంయుతా.

యన్నట్లు సముద్రమును దాఁటువానికి నావవలె వారికిఁ గరచరణములతోడి కరణ కళేబరము లొసఁగి,

www.mohanpublications.com

యవి యేవిధముగ నుపయోగించినఁ బ్రకృతిబంధము పాయునో యా విధము దెలియునట్లు శాసనములను శాసించెను. కావుననే శ్రుతి స్మృతులు శాస్త్రములని పేరొందినవి. "శ్రుతిస్మృతి ర్మమై వాజ్ఞా" యన్నట్టు లవి భగవదాజ్ఞావాక్యములై యున్నవి. రాజాజ్ఞ నుల్లంఘించువాఁ డెట్లు మేలుపొందఁడో భగవదాజ్ఞ నుల్లంఘించువాఁడును మేలు పొందఁడు.

రాజు దండించునట్లు భగవంతుఁడు దండించునా? అట్లైనచో నాయన పరమకారుణికుఁడు హేయగుణరహితుఁ డెట్లయ్యె నందురేమో. ఇక్కడనుండి కాశికిఁ బోవలయుననిన మార్గములోఁ గొండలు, గుట్టలు, వంకలు, వాగులు నెన్ని యో కలవు. అడవులలో ఘాతుకజంతువు లెన్నియో కలవు. వీని వాతఁబడక కారుచిచ్చులకుఁ జిక్కక ముండ్లు ఱాలు ద్రొక్కకపోవుమార్గములును గలవు. ఈ మార్గములు తెలుపు గ్రంథములు గలవుగదా. ఆ మార్గములఁ బోవక యలక్ష్యముచేసి పెడత్రోవ ద్రొక్కు వాఁడు కారుచిచ్చులోఁ గాలిపోవును. పులివాతనైనఁ బడును. నదీప్రవాహములోఁ గొట్టుకొనియైనఁ బోవును. ఇట్టు లేదో యొక యపాయము పాలై కాశి చేరలేనట్టు శాస్త్రము నుల్లంఘించువాఁడును గమ్యస్థానముఁ జేరనేరఁడు. తప్పుడుత్రోవను బోవువాఁడు కీడులపాలైనచో నెవ్వరు త్తరవాదులు? చక్కనిమార్గమును దెలిసినవాఁడు వానిని శిక్షించినాఁడని చెప్పవచ్చునా?

ఈ కారణముచేతనే శ్రీకృష్ణభగవానులు భగవద్గీయం దర్జునున కిట్లుపదేశించిరి.

శ్లో. తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే, కార్యాఽకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం, కర్మకర్తు మిహార్హసి. భగ. 16.

ద్వి. కానఁ గార్యంబు నకార్యంబుఁ దెలియఁ
గా నీకు శాస్త్రంబె కడుఁ బ్రమాణంబు
తెలిసి శాస్త్రోక్తవిధిం గార్యములను
జలుపఁగాఁ దగుదు విచ్చటఁ బాండుతనయ. ద్వి. భగవ. 16.

అట్టులే ప్రకృతియనెడు మహారణ్యముదాఁటి పరమపదవికిఁ బోవలయుననిన సుఖమార్గములను దెలుపునవే శాస్త్రములు.

ప్రకృతి గుణమయము. దీని దాఁటినఁగాని మోక్షము లేదు. దానిని గాంక్షించువాఁడు సత్త్వమార్గముననే పోవలయును. శాస్త్రము లీ మార్గమునే చెప్పును దీనిని విడిచి రజస్తమో మార్గములఁ బోవువాఁడు కీడులపాలగును. ఈ కీడులు తాను జేసిన కర్మముల ఫలములేకాని క్రోధావిష్టుఁడైన భగవంతునిచేఁ గలిగింపఁబడినవి కావు. కావుననే తన మేలుకోరు ప్రతి జీవియు శాస్త్రచోదిత సన్మార్గమునఁ బ్రవర్తింపవలయును. తన నాలుక తాను గొఱికికొని యితరుల దూషించి యెక్కువ పాప మొడిగట్టరాదు. నిప్పుద్రొక్కినఁగాలుకాలును. దేవుఁ డేమి చేయును?

ఇట్లు సంసారమును దరించుటకు సాధనమైన దేహము నిచ్చి దాని నుపయోగించు విధముఁ దెలుపు శాస్త్రమునిచ్చి యీ మార్గమునఁ బొండని భగవంతుఁడు చెప్పఁగాఁ దమకుఁగల కించిత్స్వాతంత్ర్యమును దుర్వినియోగపఱిచి కొందఱు జీవులు రజస్త మనస్సులపాలై తాము చెడుటయేగాక సరియైన సత్త్వమార్గమునఁ బోవువారిని బీడింతురు. అడవిలో దొంగలు ప్రబలులై బాటసారులను బీడించిరేని రాజేమిచేయును? బాటసారులు తమ్ముఁ దాము గాపాడుకొన శక్తిగలవారై యుండువఱకుఁ దెలిసి భగవంతుఁడే యవతార మెత్తవలసిన సందర్భము లేవి త్రేతాయుగంబునఁ గలిగెనో చూతము. సనకసనందనాదుల శాపంబున జయవిజయులు రాక్షసులై రావణకుంభకర్ణులుగ జనించి లోక మాకులము చేయుచుండిరి. వీరు శ్రీనారాయణుచేఁ దప్ప నితరులచేఁ జచ్చువారు కారు. వీరు చేయు దుండగములా యిన్ని యన్ని కావు.

సీ. మునికోటు లడవుల ముక్కు పట్టఁగ రాదు
దేవతల్ వాహ్యాళి దిరుగ రాదు
గంధర్వకోటులు గాన మెంచఁగ రాదు
యాయజూకులు యాగ మనఁగరాదు
తెఱగంటి కన్నెలు తెరువులఁ జనరాదు
నందనం బనుపే రనంగరాదు
సురకోటులు హవిస్సు జోలి పల్కఁగరాదు
చెలువలు కై సేఁత సేయరాదు.

చం. చనుచును రావణుండు బలసంపద పొంపిరివోవుచుండఁ గ్రొ

www.mohanpublications.com

వ్వనఁ దన మార్గమందు నృపపుష్కర నేత్రల మౌనికన్యలన్
దనుజకులాంగనామణుల దైవతకాంతల వీరువారటం
చన కగపడ్డ సుందరుల యౌవతముం గులకన్యకాతతిన్.

చం. బలిమిని ముట్టి, యడ్డపడు బంధువులం బడఁగొట్టి, కేలుగొ
ప్పులుబిగఁబట్టియ చ్చెలులు బ్రుయ్యఁగఁదిట్టఁగమొత్తుకోఁగనీ
డ్గిలఁ బడనీడ్చి కొంచరిగి టెక్కువ పెక్కువఁ బుష్పకంబునన్
దలరక పాపమంచనక దానవుఁ డందఱనుంచె మోహియై.

కం. ఈనెఱిఁ బన్నగకన్యల
మానవభామలను నసురమానినులన్ ర
క్షోనారుల యక్షసతుల
దానవయోషల విమానతలముం జేర్చెన్.

ఇంతకంటెను దుండగము లుండునా? వీని నణఁచువాఁడు పదునాలుగు లోకంబుల నెవ్వఁడు లేఁడయ్యెను.

అప్పుడు చెఱఁబడిన పతివ్రత లిట్లు శపించిరి.

చం. అతులిత పాప హేతువు పరాంగనలం దమిసేఁత, వీఁడు దు
ర్మతిపర కాంతలైనమము రాగమునం జెఱుపంగఁ గోరెడిన్
హతుఁడగుఁగాక యీ చెనఁటి యన్యతలోదరి కారణంబుగా
సతులను యేని మేమిదియె సత్యము గావుత మంచుఁ దిట్టినన్.

మేము పతివ్రతల మైతినేని పరస్త్రీ కారణంబుగా వీఁడు హతుండగుఁగాక యని శపించిరి. పతివ్రతల శాపము వ్యర్థమగునా ! జగన్మాతయైన శ్రీమహాలక్ష్మి లోకంబులఁ దనపుత్రికలకుఁ గలిగిన కష్టము శీలనష్టియు నాలోచించి దానిఁ జక్కఁ జేయ వేఱుపాయంబు లేమిఁజేసి పతివ్రతల వాక్యము సత్యముఁ జేయఁ దానుదప్ప మఱి యేస్త్రీయును శక్తురాలు గాదని యోజించి భర్తతో నాలోచించి యయోనిజయై వేదవతియను పేర జనించి నిమిత్తముఁ గల్పించి నీ వధకు నేను గారణభూతురాల నయ్యెదనని రావణు శపించి సీతయై యవతరించి లంకఁ బ్రవేశించి రావణుని సమూలము ద్రుంచి స్త్రీల రక్షించెను.

విష్ణుమూర్తియును దేవతల శరణాగతియు, భృగుశాపము, భక్తవాంఛ, జయవిజయులకుఁ దాను జేసిన బాస, దశరథుఁడు పూర్వజన్మంబున మనువుగా నున్న వేళ నిచ్చిన వరము లోనగు ననియెల్ల నాలోచించి కౌసల్యాదేవి చేయుచుండిన నవమీ వ్రతము సార్థకమగునట్లు నవమినాఁడు దశరథపుత్రుఁడై యవతరించెను.

ఇట్లు చైత్రమాసంబున, శుద్ధపక్షంబున, నవమీతిథిఁ బునర్వసూనక్షత్రంబునఁ గర్కటక లగ్నంబున నభిజిత్తున విష్ణుమూర్తి మాయామనుష్యుఁడై జనియించె : (రామనామము ప్రస్తుతమగుటచే లక్ష్మణాదులు చెప్పఁబడరైరి.)

ఇట్లవతరించిన కుమారునకు వసిష్ఠమహర్షి రామ యను రెండక్క రములచే నామకరణము గావించెఁ గాని "గోవర్ధనగిరి ధరగోపికా వస్త్రాపహరణరా" వనునట్లు దీర్ఘనామధేయ మిడఁ డయ్యె : అట్లైనచో వసిష్ఠుడజ్ఞుఁడా? ఈ రామునకుఁ బౌరోహితముఁ జేసి గురువనుపించుకొని నంగీకరించినవాఁడు, బ్రహ్మపుత్రుఁడు, "అహంవేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్, వసిష్ఠోపిమహాతేజా" యని విశ్వామిత్రునిచే యోగ్యతాపత్రిక నొందినాఁ డజ్ఞుఁడగునా? కాఁడు కాఁడు. పరతత్త్వము నవతారతత్త్వము నెఱింగియే భగవానుఁడగు వసిష్ఠుఁడీ పేరిడియె. అది యెట్లో మన మిఁక విచారింపవలయును.

ముక్తిప్రదంబులని పే రెన్నికఁగన్న యయోధ్య, మథుర, మాయ (హరిద్వారము) కాశి, కాంచి, యవంతి (ఉజ్జయిని) ద్వారావతి (ద్వారక) యనెడు దివ్యక్షేత్రంబులలో శ్రీరామ చంద్రమూర్తి తనయం దావిర్భవించుటచేఁ గదా యయోధ్య ప్రథమగణ్యంబయ్యె. "దేవానాంపూరయోధ్యా" యని వైకుంఠమున నేకదేశమునకుఁ గలపేరు నేతి బీరకాయవలెఁగాక యయోధ్య దాను సార్థకముగ వహించుట శ్రీరాములు సంభవించుటచేతనే కదా. "మాసానాం మార్గశీర్షోహమ్" నెలల యందు మార్గశిరమను పేరుగల నెలతానని శ్రీకృష్ణమూర్తిచెప్పి నను సీతాపతి దనయందు జన్మించుటచేఁ గదా మాసంబులం దెల్ల జైత్రమాసంబు మొదట గణింపఁబడు నదృష్టంబు గలదయ్యెను.

నెలనెలకుఁ బున్నమవచ్చుచుండినను, యందు ముత్తెము వంటియొంటిచిత్రా నక్షత్రములోఁ గూడిన యీనెల చంద్రుఁడే కదా సీతాసహితుఁడైన శ్రీరామచంద్రునితో నుపమింపఁబడెను. తనయందు జన్మించిన

www.mohanpublications.com

కారణముచేఁగదా పునర్వసువు సార్థక నామధేయము గలదయ్యెను. తనయం దుద్భవించిన హేతువునఁ గదా యభిజిత్తు సర్వదోషముల హరింప శక్తిగల దయ్యెను. హరిచరణంబులఁ బుట్టిన గంగ తాను బావనయగుటయే గాక లోకపావిన యయినట్లులు శ్రీరామచంద్ర జననమునకు సంబంధించిన దేశకాలములు నిట్లు దాము పవిత్రంబులై యితరులనుఁ బవిత్రులఁ జేయుశక్తి గలవయ్యెను. వరుసవేదిని సోఁకిన యినుముగూడ బంగారగునుగదా. ఇఁక నమ్మహామహుని సదాహృదయమున నిడికొని యాయన పవిత్రనామమును స్మరించువా రెంత మహిమగలవారు కాఁజాలరు? ఆయన మహిమ యిట్టిదన యెవ్వఁడు చెప్పఁగలఁడు. ఆకాశము కొనఁ గనుఁగొనఁగవాఁడు చెప్పఁగలఁడేయో "యస్య మహిమార్ణ వశీకరాణుశ్శక్యోనమాతు మపిశర్వపితామహాద్యైః" ఎవ్వని మహిమ యనెడి సముద్రములోని యొకనీటితుంపరలోని పరమాణువును గూడ వాణీపతి శర్వాణీపతి గూడ నెఱుంగఁ జాలరఁట. ఇఁక నితరుల నెన్న నేల? పరమేష్ఠి పరమేశ్వరులందు లోపముఁ జెప్పనేల? ఇట్టి లోప మా యాదిమదంపతులగు లక్ష్మీనారాయణులయందే గలదు. ఆకాశము తన కడపల దా నెఱుఁగని కరణి వారిమాహాత్మ్యము నంతయు వారే యెఱుఁగరు. "యస్యాస్తేమహిమాన మాత్మన ఇవత్వద్వల్లభోపి ప్రభు ర్నాలం మాతు" మని పెద్దలు వచించిరి.

శ్రీరామనామమహాత్మ్యం బపారపారావారంబు. సింహమును గ్రామసింహముతోడను, జెఱకును వంట చెఱకుతోడను బులిని నీఁగపులితోడను బోల్చినట్టు శ్రీరామనామమాహాత్మ్యమును సముద్రముతోఁ బోల్చుట నీచోపమయని యెఱుంగుదు. లోకులు మహాసముద్రమునకంటె గొప్పదాని నెఱుంగరు. శ్రీ రామనామమునకు సరియైనది దానికంటె వేఱొండు లేదని నిఁకనధికమైన దెక్కనుండివచ్చును. కావున లోకులెఱిఁగిన దానిలో సముద్రము గొప్పదిగావున దానితోఁ బోల్చితిని. వాల్మీకి మహర్షియు నిట్టులేగదా వేఱుగతిలేక శ్రీరాములను గుబేరునితోను-సముద్రముతోను-మేరుపర్వముతోను-నింద్రునితోను బోల్చెను. పాపము శమించునుగాక. లోకులు క్షమింతురుగాత.

1. వాల్మీకిమహర్షి యంతటి గొప్పవాఁడగుటకు శ్రీరామ నామమేకదా కారణము.

2. "కాశ్యాం తు మరణా న్ముక్తికి" కాశిం జచ్చినవారికి ముక్తిగలదందురు. అది యెట్లు? కాశియందు మరణించు ప్రతిజీవికిఁ బ్రాణోత్క్రమణసమయంబునఁ గుడిచెవిలో శివుఁడు తారకమని ఖ్యాతివహించిన శ్రీరామనామము నుపదేశించును. ఆ నామ మంత్యదశలోఁ జెవిసోఁకుటచే ముక్తి గలుగును.

3. గంధమాదనంబున నేఁటికిని గంధర్వ కిన్నర చారణాదులు శ్రీరామచరిత్రంబునేకదా గానము సేయుదురు.

4. కొలఁదిగనో గొప్పగనో శ్రీరామకథ చెప్పనివాఁడు కవిగాఁడని కవిసమయము గలదుగదా.

ప్రతి ప్రసిద్ధఋషీశ్వరుఁడో యతనిపేరఁ దనమతము చొప్పున నితరుఁడో యొక్కొక్క రామాయణము వ్రాసియున్నాఁడు. ఇట్టివి 108 రామాయణములు గలవందురు.

5. కలికాల కవిపుంగవులు కాళిదాస భవభూతి మురారి జయదేవాదులు రఘువంశ మహావీరోత్తర రామచరిత్రాది కావ్యములు వ్రాసినవారే. ఈ సంప్రదాయము మనస్సున నుంచుకొని జయదేవమహాకవి తన ప్రసన్నరాఘవనాటకంబున

శ్లో. స్వసూక్తీనాం పాత్రం రఘుతిలక మేకం కలయతాం
కవీనాం కోదదోష? స్తుగుణగణానా మవగుణః
య దేతైర్ని శ్శేషై రపరగుణబర్ధైరివ జగ
త్యసావేకశ్చక్రే సతతసుఖసువాసవసతిః.

కవులందఱుఁ దమ సూక్తిని ముక్తాఫలంబులను శ్రీరామునకే యర్పించుచున్నారే యిది కవులదోషమా? కాదు కాదు. అది గుణగణముల యవగుణమే. ఏలనఁ గవులు సద్గుణములఁ గలవారిని వర్ణింపవలసినవారు. సద్గుణములన్నియు నిశ్శేషముగ నాయనయందే సుఖముగ నెడఁబాయక వసించుచున్నవి. కావునఁ గవులంద ఱాయననే వర్ణింతురని చెప్పెను.

6. ఒక యడవిలోఁ గొందఱు కిరాతులు బాటసారులను దోఁచి జీవించుచుండిరి. వారు

శ్లో. వనే చరామో, వసుచా హరామో
నదీం తరామో నభయం స్మరామః
ఇతీరయంతోపి వనే కిరాతాః
ముక్తిం గతా రామ పదానుషంగాత్.

ఈ విధముగ వనే చరామః = అడవియందుఁ దిరుగుదము. వసుచాహరామః = బంగారు లోనైనవి

www.mohanpublications.com

హరింతము. నదీంత రామః = ఏఱుదాఁటుదము. నభయం స్మరామః = ఆవలమనము భయమును స్మరింప వలసినది లేదు. అని సంభాషించుచుండిరి. వారిమాటలయందు రామః రామ యని వచ్చుటచేతనే యా కిరాతులు మోక్షమును గాంచిరి. శ్రీరాము నుద్దేశింపక రామ యను రెండక్షరము లొకటిగఁ జేర్చి యుచ్చరించినను బుణ్యఫలము తప్పదు. ఇట్టులేకదా ప్రాణావసానదశయం దజామీళుఁడు దన కుమారుని నారాయణ యని పిలువఁగానే విష్ణు కింకరులు వచ్చి యతని యమకింకరులనుండి విడిపించుకొనిపోయిరి. అట్టులే "భోజనమునకుఁ బిలిచిన మేము రామా" యను సాపాటురాములును, "రారా మాయింటిదనుక" నని పాడునట్టి రామలును బుణ్య మార్జించినవారే యగుదురు.

7. రామచిలుకకు రామనామము నేర్పుటచేఁ గదా గోపన్న రామదాసుఁడయ్యె. (బమ్మెరపోతన గోలకొండ వేపారి యని బ్రా॥ శ్రీ॥ జయంతి రామయ్య పంతులవారనిరి. గోపన్న గోలకొండవేపారియని యిప్పుడు కొందఱనుచున్నారు. అటైనచో "అక్క భాగ్యము చూచుకొని చెల్లెలుచేయి విఱుగఁబడిన" దన్నట్టు లిప్పటి గోల్కొండ వేపారులు వారిని దలఁచుకొని గర్వింపఁ గారణము గలదు.

అట్టులే కబీరు మొదలగు భక్తుల చరిత్రములు స్మరింపుఁడు. వీరందఱు మనుష్యులు. వీరి దేమి లెక్క యందురేమో. అటైనచో సురజ్యేష్ఠుఁడైన బ్రహ్మదేవుఁడును, బరమేశ్వరుఁడై సర్వజ్ఞుఁడైన శంకరుఁడు నేమి చెప్పిరో చూతము.

8. "అట్టి శ్రీరామావతారంబు జగత్పావనంబును నస్మత్ప్రసాద కారణంబునై నుతికెక్కె" ఆంధ్రభాగవతము ద్వితీయ స్కంధము సంస్కృత భాగవతంబున 7వ అధ్యాయము ద్వితీయస్కంధమున

శ్లో. అస్మత్ప్రసాదసుముఖః కలయాకలేశ
ఇక్ష్వాకు వంశ అవతీర్యగురోర్ని దేశే.

ఇది బ్రహ్మోక్తి.

9. పరమపురుషార్థసాధకముగ శాంకరులు "గేయంగీతా, నామసహస్రం, ధ్యేయం శ్రీపతి రూప మజస్ర" మ్మని విష్ణు సహస్రనామములను ననుదినము పఠింపవలసినదిగా నియమించిరి కదా.

శ్లో. కిమేకం దైవతం లోకే, కిం వాప్యేకం పరాయణమ్
స్తువంతః కం కమర్చంతః, ప్రాప్నుయు ర్మానవా శ్శుభమ్.
కో ధర్మ స్సర్వధర్మాణాం, భవతః పరమో మతః
కిం జప న్ముచ్యతే జంతు, ర్జన్మసంసార బంధనాత్. భార.

లోకమున ముఖ్యమైన దైవ మెవ్వఁడు? ముఖ్యపరాయణుఁ డైనవాఁ డెవ్వఁడు? ఎవ్వనిని స్తుతించిన, నెవ్వని నర్చించిన మనుష్యులకు శుభంబు గలుగు? సర్వధర్మములలో శ్రేష్ఠమైన ధర్మమేది? భూమిమీఁదఁ బుట్టినవారు దేనిని జపించినయెడల సంసారబంధమునుండి ముక్తు లగుదురు?

అని ధర్మరాజు భీష్ముని బ్రశ్నింపఁగా విష్ణువే యర్చింప స్తుతింపఁ దగినవాఁడని యాయన సహస్రనామ జపము భుక్తి ముక్తులొసంగి సకలానర్థకంబులఁ దొలఁగించునని భీష్ముఁ డుపదేశించెను.

శ్లో. రమంతే యోగినోనంతే, సత్యానందే చిదాత్మని
తేన రామ పదే నాసౌ, పరబ్రహ్మ భిధీయతే.
శ్రీరామ రామ రామేతి, రమే రామే మనోరమే
సహస్రనామత స్తుల్యం, రామరామ వరాననే.
రకారాదీని నామాని, శృణ్వతో మమ పార్వతి
మనః ప్రసన్నతాం యాతి, రామనామాభి శంకయా.
విష్ణో రేకైక నామైవ, సర్వదేవాధికం మతమ్
తాదృ జ్నామసహస్రేణ, రామ నామ సమం మతమ్
జపత స్సర్వవేదాంశ్చ, సర్వమంత్రాంశ్చ పార్వతి
తస్మాత్కోటి గుణం పుణ్యం, రామనామైన లభ్యతే. పద్మ.

ఓ పార్వతీ ! సత్యజ్ఞానానంద స్వరూపుఁడగు శ్రీమహావిష్ణువు నందు యోగులు రమింతురు. కావున రామపదంబుచేఁ బర బ్రహ్మవాచ్యుఁడగు శ్రీమహావిష్ణువు చెప్పఁబడెను. అట్లగుటంజేసి నేను "శ్రీరామ రామ రామ" యని యెల్లప్పు డానందించు చుందును. ఆ రామనామము సహస్రనామములతో సమానమని యెఱుంగుము. రా యను నక్షరము మొదటఁ గల నామంబుల వింటినేని రామనామమే వచ్చునని తోఁచి నా మనస్సు ప్రసన్నత నొందును. విష్ణు సహస్ర నామంబులలో నొక్కొ క్కటి సర్వదేవాధికమ్మని నా యభిప్రాయము.

www.mohanpublications.com

అట్టి నామము సహస్రమునకు రామనామ మొక్కటే సమానము. సమస్తవేదములు సర్వమంత్రములు జపించుట వలనc గలిగెడు పుణ్యమున కంటెc గోటిమడుcగు లెక్కువ పుణ్యము రామనామము చేతనే లభించును.

అని సర్వజ్ఞుcడైన శంకరుcడు ప్రియురాలైన పార్వతికి తత్త్వముపదేశించెను.

రామనామమును గుఱించి యింతకంటె విశేషించి జెప్పనెవ్వరికి సాధ్యము?

10. వాచకమనcగా నొక పదార్థమునకుc గల పేరు. ఉదా. పక్షి.

వాచ్య మనcగా నా పేరుగల పదార్థము. ఱెక్కలుగల జీవ జంతువు. పక్షి యనcగానే ఱెక్కలుగల జంతువు. మనస్సునకు గోచరించును. ఱెక్కలుగల జంతువును జూచితిమా పక్షి యను పేరు స్మరణమునకు వచ్చును. కావునc బక్షి యనునది వాచకము వాచ్యము నయ్యెను గావున వాచ్య వాచకముల కభేదమని శాస్త్రజ్ఞ లందురు. అట్టులే రామశబ్దము వాచకము. కౌసల్యానందనుcడైన సీతాపతి వాచ్యుcడు. ఈ వాచ్య వాచకముల కభేద మంగీకరింపవలసియున్నది. ప్రణవమునకు భగవంతునకు నభేదమని 'తస్యవాచకః ప్రణవ' యని యిత్యాదులందఱంగీకరించి యున్నారుగదా. రామశబ్దమునకు రామమూర్తికి నభేదమైనయెడ రామమూర్తి యందుcగల గుణాది విశేషములను రామశబ్దము బోధింపవలదా యందురేమో. సత్యము.

11. రాముcడు సుందరుcడు. రామశబ్దమునకు సౌందర్య మర్థము.

రామమూర్తిని బురుషులైన మునీశ్వరులు మోహించి మఱు జన్మంబున గోపికలై జన్మించిరని పురాణములు చెప్పుచున్నవి గదా.

కం. ధన్యులు రఘుకుల నృపమూ
ర్ధన్యుని నా హృదయనాథు రాముని నతరా
జన్యుని రాజీవాక్షుని
మాన్యునిc గను దేవసిద్ధ మౌని ప్రవరుల్.

కం. మాన్యునిc గృతజ్ఞు నుతసౌ
జన్యుని గమలాక్షు సింహసమగతిc గృతిమా
ర్ధన్యుని నా ప్రాణవిభున్
ధన్యులు వో కన్నులార దర్శించు జనుల్.

అని సీతాదేవి రాముని కన్నులను స్మరించి స్మరించి విలపించెcగదా.

శ్రీరాముని జంపింపవలయునని కంఠదఘ్నక్రోధముతోc బోయిన శూర్పణఖ 'రాముc డెవc' డని రావణుc డడుగcగా దానికి రామాకారము దోcచుటచే నిడుదబాహువులవాcడు వెడల్పు కన్నులవాcడు దర్పక రూపుcడని రాము సౌందర్యమును వర్ణింపc బ్రారంభించెను.

అట్టులే రాముc డెట్టివాcడని సీతాదేవి యడుగcగా హనుమంతుcడును

సీ. రాముండు కమలపత్ర విశాలలోచనుం
డఖిలసత్త్వ సుమనోహరగుణుండు

అని సౌందర్యమునే తొలుత వర్ణించెను.

12. రాముcడు నల్లనివాcడు. రామశబ్దమునకు నలుపనియు నర్థము గలదు.

13. సాక్షాద్విష్ణువగు శ్రీరాముcడు జగత్సృష్టి స్థితిసంహారములు చేయc గలవాcడని శ్రీమద్రామాయణము చెప్పుచున్నది. రామశబ్దమునం దీ యర్థములు గలవు. ఎట్లన, 'రము క్రీడాయామ్' అను ధాత్వర్థముచే రాముcడనcగా గ్రీడించువాcడని యర్థము. లోకవత్తు లీలాకైవల్యమ్. బ్రహ్మసూత్రము. 171

అను సూత్రమునకు "కేవలాయా లీలాయా సృష్ట్యారంభ ప్రయోజనత్వం సంభవతీ త్యర్థః (లోకవత్) యథారాజ్ఞేకంతు కాద్యారంభే" యని సూత్రభాష్యము. అనcగాc బ్రపంచసృష్టి భగవంతునకుc గ్రీడార్థమని యర్థము. క్రీడనకము (ఆటపదార్థము) లేక క్రీడలేదు. కావునc గ్రీడించువాcడనcగాc దత్పూర్వమే సృష్టించి యప్పుడు పాలనము చేయుచున్నాcడని యేర్పడును. దీనివలన సృష్టిస్థితులు రెండు నేర్పడెను. రామ శబ్దమునకు విరామమనియు నర్థము గలదు. సృష్టిస్థితులనుండి విరమించువాc డనcగాc దత్సంహారకుcడని యర్థము.

విష్ణు సహస్రనామములతో "శుభేక్షణః రామో విరామో" యని కలదు. శుభేక్షణుcడు రాముcడు విరాముcడని యర్థము. ఈ మూcడు శబ్దములు నొకచో వరుసగc జేర్చిన విధముc జూడ సృష్టిస్థితి సంహారకత్వ శక్తుల దెలుపనని తోcపక పోదు. శుభేక్షణుcడు = మంచి కన్నులు చూపుగలవాcడని యొక యర్థము. మంచి సంకల్పముగలవాcడని రెండవ యర్థము. ఇచ్చట దీనినే గ్రహింపవలసియున్నది. ఈక్షణశబ్దమునకు సంకల్ప మనియే యర్థమని "ఈక్షతేర్నాశబ్దమ్" బ్ర. సూ. 15-5. "తదైక్షత బహుస్యామ్" యను మంత్రములకు

www.mohanpublications.com

వ్యాఖ్యాతలు వ్యాఖ్యవ్రాసియున్నారు. ఈ సంకల్పము సృష్టివిషయమే. రాముఁ డనఁగా గ్రీడించువాఁడనుటచేఁ బాలించువాఁడను యేర్పడుచున్నది. విరామశబ్దమునకు మీఁద వ్రాసినట్లే. కావున రామశబ్దము రామవాచ్యునిఁ దెలుపుచున్నది.

రాముఁడు జగదీశ్వరుఁడని శ్రీరామాయణంబునఁ బెక్కు చోట్లఁ గలదు గదా.

రా యనఁగా బ్రపంచము. మ యనఁగా నీశ్వరుఁడని రామశబ్ద నిర్వచనము.

శ్లో. "రా శబ్దో విశ్వవచమో, మశ్చా పీశ్వర వాచకః
విశ్వధీనేశ్వరో యో హి, తేన రామః ప్రకీర్తితః.

ఈ విధముగ రామవాచకమునకు రామవాచ్యునకు నభేదమనియు రామమూర్తియందుఁ గల విశేషములు రామనామ మందును గలవనియుఁ దెలిసికొంటిమి.

14. ఇఁక సాంఖ్యశాస్త్రమువలన మనమేమి తెలిసికొనఁ గలమో చూతము. సాంఖ్యమనఁగాఁ గపిల సాంఖ్యముగాదు. సంఖ్యలకు సంబంధించినది.

శ్రీరామమూర్తి జననము కర్కటకలగ్నమందుఁగదా. ఇది మేషాదిగ నాలుగవలగ్నము. దీనివలనఁ దనయందు భక్తి శ్రద్ధలు గల నాలుగువర్ణములవారికి నాలుగు విధములైన పురుషార్థములు తారతమ్యదృష్టి లేక యిచ్చువాఁడని యేర్పడుచున్నది. నాలుగు వర్ణము లుపలక్షణము. సర్వ వర్ణములవారికే కాక నాలుగు విధములైన యుత్పత్తులుగల దేహుల కనియు నర్థము. కావుననే కదా పక్షియైన జటాయువును, బోయెతయగు శబరిని, మృగములైన వానరభల్లూకాదులను, రాక్షసులైన విభీషణాదులను, నయోధ్యాపురమందలి సమస్త జీవులను శ్రీరాముఁడు సమానముగ నాదరించి ముక్తులఁ జేసెను. జ్యౌతిష మందు నంకెలకు బదులుగ నక్షరముల వ్రాయుదురు. కాదినవ, టాదినవ, పాదిపంచ, యాద్యష్టక మని యా శాస్త్రమున నియమము. పాదిపంచ = పకారము మొదలైదక్షరములు.

| | | | | |
|---|---|---|---|---|
| ప | ఫ | బ | భ | మ |
| 1 | 2 | 3 | 4 | 5 |

అయిదని చెప్పవలసినచోట మకారము చెప్పవచ్చును. యాద్యష్టకము = యకారము మొదలు 8 యక్షరములు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| య | ర | ల | వ | శ | ష | స | హ |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |

రెండు చెప్పవలసినచోట 'ర' చెప్పవచ్చును. ఇందు హ్రస్వములు దీర్ఘములను భేదము లేదు. రా = 2-ర = 2. ఈ సూత్రములచొప్పున రా = 2-మ = 5 కావున రామయనఁగా 15. ఈ సాంఖ్యము జ్యౌతిషమందే కాక వేదాంతాదుల యందును బ్రయుక్తమై యున్నది. ఎట్లన

"రథస్థం కేశవం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే" రథస్థుఁ డైన కేశవునిఁ జూచిన పునర్జన్మము లేదని దీని యర్థము. ఈ బాహ్యార్థముమాత్రమే సత్యమైనచో లీలావిభూతి యచిర కాలములోనే శూన్య మగును. రథశబ్దమున కుఁ దేరనియు దేహమనియు నర్థములు. 'ఆత్మానం రథినం విద్ధి, శరీరం రథమేవతు.' కఠ. రథశబ్దమునకు హృదయమనియు నర్థము గలదు. కావునఁ దన హృదయమందుండు విష్ణుమూర్తినిఁజూచిన మరల జన్మములేదని యర్థము.

సాంఖ్యముకూడ నీయర్థమునే బోధించుచున్నది. మీఁదఁ జెప్పిన సూత్రములప్రకారము రథ=27 అగును. రథస్థుఁ డనఁగా నిరువదియేడింట నుండువాఁడని యర్థము. ఇరువదియేడింట నుండువాఁడు పరమాత్ముఁడే. దూరాలోచనము లేని వారు కొందఱు బాహ్యార్థము వ్యర్థమనియు నంతరార్థమే ప్రధానమనియు నందురు. ఇట్టివారు మోక్షసాధనమునకు దేహ మనావశ్యక మనునట్టివారు. (ఇది శాస్త్రమునకు శిష్టాచారమునకు ననుభవమునకు విరుద్ధమైన వాదము. ముముక్షువులగు విజ్ఞులు రెండును నావశ్యకమందురు. ఉట్టి కెగురలేనమ్మ స్వర్గానికి నెగిరినట్టు బాహ్యమున దృష్టి మనస్సు నిలుపలేని వారంతరమం దెట్లు నిలుపఁగలరో.)

మీఁద రామ యనఁగా 25 అని తెలిసికొంటిమి. ఈ రెండెంకల నేమి చేయవలయును? సంకలనము (కూడిక) చేయవలయునా? గుణకము (హెచ్చించుట) చేయవలయునా; అట్టులే యుంచి యిరువదియై దనవలయునా? 'అంకానాం వామతో గతి' యను న్యాయము ననుసరించి 52-గ గ్రహింప వలయునా? ఇన్నియుఁ జేయవలసినవే.

తొలుత సంకలనము చేసిన 2+5 = 7 అగుచున్నది. ఈ యేడవసంఖ్య శ్రీరాముల జన్మనక్షత్ర మేడవది యని, యవతార మేడవది యని తెలుపుచున్నది. ఊర్ధ్వలోకంబుల నేడింటిని నధోలోకంబుల నేడింటిని

www.mohanpublications.com

సప్తవ్యాహృతులుగ వ్యాపించి యుండు విరాట్పురుషుఁ డీ యేడవ యవతారమూర్తి యని యెఱింగి కదా వాల్మీకిమహర్షి యీ యర్థంబు స్ఫురింప శ్రీమద్రామాయణంబును నేడు కాండంబులుగ నేడు వ్యాహృతుల యర్థము గలదిగఁ జేసెను.

శ్రీరామాయణాంతస్సారం బంతయు సప్తసంఖ్యపై నిలిచి యున్నది. శ్రీమద్రామాయణమునఁ గాండము లేడు. కాండములనఁగా నీళ్ళు, నీళ్ళన్నియు నేడు సముద్రములైనట్లు 'వందేరామాయణార్ణవ' మ్మనఁబడు శ్రీమద్రామాయణము మహార్ణవముకూడ నేడు కాండములు గలదయ్యెను. సముద్రము లెట్లగాధములో రామాయణ కాండముల ట్లగాధములు. వ్యాఖ్యానములు పర్యాప్తములని తలంపకుఁడు. వ్యాఖ్యానములం దన్నిటఁ జెప్పఁబడని యర్థవిశేషంబు లెన్నియో కలవు. రామ రావణ యుద్ధకాల మేడుదినములు. ఆ యుద్ధమునందలి ముఖ్య వీర పురుషు లేడ్వురు. ఈ సప్తకాండసంఖ్య సప్తావరణములను దెలుపుచున్నది. "సప్తప్రాకార మధ్యే" యనుదాని యర్థము నిందు ననుసంధింపఁదగు. ఈ సప్తసంఖ్య చిత్ర మీ శ్లోకము నందును గాననగు. ఇది దేహవిషయము.

శ్లో. కలా సప్తాశయా సప్త, ధాతన స్సప్తతన్మలాః
సప్తోపధాతవ స్సప్త, త్వచ స్సప్తః ప్రకీర్తితాః.

శ్రీరామాయణమును సప్తస్వర యుక్తంబుగ స్వరతాల లయాదులకు సరిపోవునట్లు గేయముగఁ గద వాల్మీకి రచియించె. నాదబ్రహ్మము రామమూర్తియే యని యేర్పడియె.

సప్తతంతు వనఁగా యజ్ఞము యజ్ఞాంగి యజ్ఞపురుషుఁడు యజ్ఞేశుఁడు యజ్ఞకర్త యజ్ఞఫలము యజ్ఞ భోక్త సర్వము శ్రీరాముఁడే.

అ ఇ ఉ ణ్, ఋ ఌ క్, ఏ ఓ ఙ్ అను మాహేశ్వర సూత్రముల చొప్పున వర్ణసమామ్నాయమందలి యేడవ యక్షరము ఓ. ఇది రామశబ్దము ప్రణవమని సూచించుచున్నది. ఇఁక 2×5 గుణకము చేసిన 10 యగును. పదికి సంస్కృతమున దశమని పేరు. ఈ దశశబ్దము దశరథ శబ్దమునందు దశకంఠ శబ్దమునందుఁ గాననగు. మొదటివానికి మొదటియంకె రెండవ వానికి రెండవయంకె 5 యన్వయించినచో శ్రీరాముఁడు మొదటివాఁడైన దశరథునకు (రెండు) నిహపరములు నొసఁగెననియు, రెండవవాఁడగు దశకంధరునకుఁ బంచత (5) గూర్చెననియు నేర్పడుచున్నది. పంచత యనఁగా మరణము. శ్రీరాముల జన్మమాస తిథులను గలిపిన నీ యంకెయే లభించుచున్నది. చైత్రమాసము 1. నవమి 9, 1+9 = 10.

ఇఁక నీ రెండంకెల నేకముగ 25 అని గ్రహింతము.

ఈ 25 దశరథునికి స్వర్గప్రాప్తి కాలమును రావణాది రాక్షస పదార్థమై శ్రీరాము లరణ్యవాసముఁ జేయఁబూనిన కాలమును దెలుపును.

కం. ప్రతిభటరహితుం డగునా
పతి కిరువదియేను సమల ప్రాయం బవు డీ
క్షితి మజ్జననం బాదిగ
హితగుణ ! నా కపుడు పదియు నెనిమిది యేఁడుల్. ఆం. వా.

అని సీతాదేవి రావణాసురునితోఁ దన భర్త యరణ్యమునకు వెడలినపుడు 25 యేఁడుల ప్రాయము వాఁడని చెప్పెను.

25. ఆత్మసంజ్ఞ. "పంచవింశోయం పురుషః" "పంచ వింశ ఆత్మా భవతి" యని ప్రమాణములు. "అహ మాత్మా గుడా కేశ" యనియు "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతన" యనియు శ్రీకృష్ణమూర్తియే యను గ్రహించెను. గదా.

'అంకానాం వామతో గతి' యని 25ను 52 గఁ జూచిన నేమియర్థము గోచరించునో చూతము. ఏ రెండంకెలు గూడిన 52 అగును. 27+25 = 52. 26+26 = 52 అనరాదా. 30+22 = 52 అనరాదా. 27+25 = 52 అనుటకేమి కారణ మందురేమో. ఈ విభజనమందు నేను స్వతంత్రుఁడఁ గాను.

'మ' = 25, ర = 27. కావున రా+మ=27+25=52 అయ్యెను.

మ = 5 అనితినికదా. 25 యెట్లయ్యె నందురేని హల్లుల యందు 'మ' యిరువది యైదవది. వేదాంతు లిట్లే గ్రహించి యున్నారు.

శ్లో. భూతాని చ కవర్గేణ, చవర్గేణేంద్రియాణి చ
టవర్గేణ తవర్గేణ, జ్ఞానగంధా దయ స్తథా
మనః పకారేణే వోక్తం, ఫకారేణ త్వహం కృతిః
బకారేణ, భకారేణ, మహాన్ ప్రకృతి రుచ్యతే

www.mohanpublications.com

ఆత్మాతు స 'మకారేణ', పంచవింశః ప్రకీర్తతః

| | | | |
|---|---|---|---|
| అనఁగా | క ఖ గ ఘ ఙ | = పంచభూతములు | 5 |
| | చ ఛ జ ఝ ఞ | = పంచేంద్రియములు | 5 |
| | ట ఠ డ ఢ ణ | = జ్ఞానేంద్రియములు | 5 |
| | త థ ద ధ న | = గంధాదులు | 5 |
| | ప | = మనస్సు | 1 |
| | ఫ | = అహంకారము | 1 |
| | బ | = మహత్తు | 1 |
| | భ | = ప్రకృతి | 1 |
| | | | 24 |

ఈ ప్రకారము 24 కాఁగా 25వ వాఁడు మకార వాచ్యుఁడైన జీవుఁడగుచున్నాఁడు. 'మకారో జీవవాచక' యని ప్రమాణము. మకారము 25 కాఁగా 26వ హల్లు యకారమగు చున్నది. 27 వది ర కారము. కావున రా+మ = 27+25 = 52 అయ్యెను. 25 జీవుఁడు 26 కాలము 27 పరమాత్ముఁడని సంకల్ప సూర్యోదయంబున నెన్నంబడినది. ప్రణవమందును మకారము జీవవాచకమే కదా.

'ఓమ్' అను ప్రణవమునందువలె 'రామ' యనునపుడు మకారము భిన్నముగాఁ గానవచ్చుటఁజేసి పరమాత్మ (రా) జీవాత్మలు (మ) భిన్నులని కొంద ఱందురు. ఓమ్ అనుచో ఓ అచ్చు. మకారము హల్లు. ఈ రెండెట్లు పరస్పర భిన్నములో యట్లె జీవాత్మ పరమాత్మలని కొందఱ వాదము.

ఉపాధి భేదముచే వేఱు వేఱుగాఁ దోఁచినను నేకశబ్దంబున నేక సంఖ్యయందు లీనమై 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" యన్నట్లు లేకమగుటచేఁ గొందఱు జీవాత్మ పరమాత్మల కభేదము నేకత్వము చెప్పుదురు.

రామ యన్నప్పుడు రకార మకారములు భిన్నములుగా నుండి సమానస్కందమున నిలిచియుండునట్లు ముక్తదశయందును జీవపరమాత్మలకుఁ గొందఱు కించిన్న్యూనంబుగ సమత్వంబును భిన్నత్వమును జెప్పుదురు. వీరిమతమున నిట్టి స్థితియే సాయుజ్యము. సయుక్ భావము సాయుజ్యము. పరమసామ్యమని యర్థము. "ఓమిత్యేకాక్షరమ్. నమ ఇతి ద్వేక్షరే" యన్నట్లు ఓమ్ అనునది యొక యక్షరమే. అయినను నిది సజాతీయ విజాతీయ భేదరహితమై యేకమైనదిగాదు. అ+ఉ+మ్ కలసికదా ఓమ్ ఆయెను. ఇం దచ్చులైన అకా రోకారములు సజాతీయములు. ప్రాణియైన మకారము (హల్లు) విజాతీయము. ఈ మూఁడు తత్త్వములు గలసి యేకతత్త్వ మయ్యెనని వీరి యభిప్రాయము. ఇక్కడ నొక సందేహము. అకారము ఈశ్వరుఁడు. మకారము = జీవుఁడు (చిత్తు). ఉకారము లక్ష్మియైనచో నచేతనమైన ప్రకృతి గతి యేమి? ప్రకృతియే లక్ష్మియని కొందఱ మతము. 'యవనికా మాయా జగన్మోహినీ' యన్నట్లు శ్రీదేవికిఁ బ్రకృతి పరదాయయి జీవులకు భగవంతుఁడు కానరాకుండఁ జేయునది కావున నుపకరణమని కొందఱ మతము. ఏ ప్రకారము చూచినను దత్త్వత్రయమునకు హానిలేదు. ఇఁక సాంఖ్య విచారము చాలించి మఱియొక విధముగఁ బరిశీలింతము.

తారకమను పేరు ప్రణవమునకు రామశబ్దమునకుఁ గలదంటివి. అట్లైనచో రెండును సమానార్థముగలవై సమాన ఫలము నిచ్చునా యందు రేమో?

| | | | |
|---|---|---|---|
| ప్రణవము. | అ | ఉ | మ. |
| రామశబ్దము. | ర | ఆ | మ. |

"అ ఇతి భగవతో నారాయణస్య ప్రథమాభిధానమ్" "అకారార్థో విష్ణు" వనునటులు "అ" కారము నారాయణుని పేరు. అట్టులే రకారము పరమాత్మ వాచకమని ముందే చెప్పఁ బడెను. నారాయణుఁడే పరమాత్మ.

ప్రణవమునందలి రెండవయక్షరము ఉ. రామశబ్దమునందలి రెండవ యక్షరము ఆ. ఈ రెంటికిని శ్రీదేవియనియే యర్థము.

శ్లో. అకారేణోచ్యతే విష్ణుః, సర్వలోకైక నాయకః
ఉకారేణోచ్యతే లక్ష్మీ, ర్మకారో జీవవాచకః.

అని బ్రహ్మసంహిత యందుఁ గలదు.

ఇఁక 'ఆ' యనఁగా లక్ష్మి యెట్లయ్యెనో చూతము. అకారము విష్ణువు గావున ఆకారము లక్ష్మియయ్యె.

అకారము విష్ణువైనపుడు దాని స్త్రీలింగరూపము నారాయణీ శంకరీ యన్నట్లు 'ఈ' కావలయునుగాని 'ఆ' యెట్లగునని వైయాకరణు లాక్షేపింతురుకాఁబోలు. వ్యుత్పత్తులు మూఁడు విధములు. వైయాకరణమతమున

www.mohanpublications.com

నొకటి. పౌరాణికమతమున నొకటి. మంత్ర శాస్త్రజ్ఞుల మతమున నొక్కటి. ఉదాహరణము. విశ్రవశ్శబ్దమునకు నపత్యార్థక తద్ధితము. (కొడుకను నర్థమున) రావణుఁ డయ్యెనని వై యాకరణు లందురు. కైలాసపర్వతము క్రిందఁ జేతులుపడి నలిగినపుడు లోకము నిండ ధ్వనించుటచేఁ గాని, లోకమును హా హా రావపూరితమును జేయుటచేఁగాని రావణుఁ డయ్యెనని పౌరాణికు లందురు. రామ పత్నీం వనస్థాం, వినాయేతి రావణ" యని మాంత్రికు లందురు. రామ పత్నిని వనస్థను నపహరించినవాఁడు రావణుఁడు. ఇది మంత్ర విచారసమయము కావున మాంత్రికుల యర్థమునే గ్రహింప వలయును. నారాయణు భార్య 'నారాయణీ', శంకరు భార్య 'శంకరీ' యగుట సత్యమే. అట్టులే భార్యయను నర్థంబుననైనచో అకారవాచ్యుని భార్య 'ఈ' కావలయును. 'ఆ' యనఁగా లక్ష్మి యగుట కేవల భార్యార్థంబునఁ గాదు. యౌగికార్థంబున నని గ్రహింపవలయును. ఎట్లన : ఈశానుని భార్యయని చెప్పునపుడు 'ఈశాని' యనవలయును. ఈశాని యందు నీశామని యీ శత్వముండిన నుండవచ్చును. లేకుండిన లేకపోవచ్చును. 'ఈశానా' యన్నప్పుడట్లుగాదు. ఈశానునియం దెట్టి యీశత్వము గలదో యట్టి యీశత్వముగల స్త్రీ యని చెప్పునపుడు "ఈశానా" యనియే చెప్పవలయును. "ఆస్యేశానా జగతో విష్ణుపత్నీ" "ఈశానాం జగతోస్య వేంకటపతేర్విష్ణోః పరాం ప్రేయసీ" "అస్యేశానాత్వమసి జగతః సంశ్రయంతీముకుంద" మ్మని ప్రయోగములు గలవు కావున నర్థవిశేషంబున 'అ' కారవాచ్యుని భార్య 'ఆ' యగుట శాస్త్రవిరుద్ధముగాదు. అర్థవిశేషమేమందు రేని : రక్షణ, గతి, హింసాద్యర్థబోధక మగు 'అవ' ధాతువువలనఁ బుట్టిన 'అ' కారమునకు విష్ణువు వాచ్యుఁడు. శ్రీదేవియు భర్తతో సమానమైన శక్తి సామర్థ్యములు గలది గావున 'ఆ' యయ్యెను.

శ్లో. "శ్రీరామ సాన్నిధ్యవశా, జ్జగదానందకారిణీ
ఉత్పత్తిస్థితి సంహార, కారిణీ సర్వదేహినా" మ్మని

సీతోపనిషత్తునందుఁ గలదు. శ్రీ శబ్దమునకును నీ యర్థములు గలవు.

"శృణాతి నిఖిలాన్ దోషాన్, శ్రీణాతి చ గుణైర్జగత్
శ్రీయతే చాఖిలైర్నిత్యం, శ్రయతే చ పరంపదమ్
శ్రయంతీం శ్రీయమాణాంచ, శృణతీం శృణ్యతీమపి.

దీని యర్థమునకు నాంధ్రవాల్మీకి రామాయణ మందలి రెండవ పద్యము సీతాదేవి స్తుతిఁ జూడుఁడు.

జీవవాచకమైన మకార ముభయత్రసమము. అకారము విష్ణువాచకము. మకారము – జీవవాచకము. ఆ రెంటికి నడుమ నున్న 'ఉ' కార మా రెంటికిఁ గల నిత్యసంబంధమును దెలుపును.

శ్లో. అకారో విష్ణు రిత్యుక్తో, మకారో జీవవాచకః
తయోస్తు నిత్యసంబంధ, ఉకారేణ ప్రకీర్తితః.

ప్రణవమునందు 'ఉ' కారము లక్ష్మీదేవిని దెలుపఁగా రామ శబ్దమందు 'ఆ' కార మామెనే తెలుపుచున్నది. ఈ జగన్మాత యే సీత. ఈమె జీవులను గనికరించి వారు చేసిన దోషములను బరిహరించి పురుషకారము వహించి భర్తతో విన్నవించి వారిని గరుణింపఁ జేయును. లక్ష్మీయందుఁ బురుషకారము ప్రసిద్ధము. సీతాదేవి కటాక్షించుటచేఁ గదా కాకాసురుని శ్రీరాముఁ డూపిరితో విడిచెను.

సీతాదేవి ప్రేరణముచేఁ గదా రామదాసుని భద్రాది రాముఁ డనుగ్రహించెను. సీతా పురుషకారము లేకుండుటచేఁ గదా రావణుఁడు హతుఁడయ్యెను.

మఱియొక విధముగఁ జూచినను నీ యర్థమే స్పష్టపడుచున్నది. మ య ర యని కదా యక్షరముల వరుస. మకార రకారార్థములు మీఁద వివరింపఁబడియె.

శ్లో. "యా స్త్రీయాం యాన, మంజర్యో, శ్శోభా, లక్ష్మ్యోశ్చనిర్మితా" యని నిఘంటువు. యాకారమునకు 1. లక్ష్మి 2. యానము (వాహనము) నర్థములు. దీనివలన జీవుని భగవంతుని బొందించునది లక్ష్మి (సీత) యని యేర్పడియె.

ఈ విధముగ రామశబ్దము ప్రణవమనియుఁ బ్రణవవాచ్యుఁ డగు పరమాత్మయే రామనామ వాచ్యుఁ డనియుఁ ప్రణవమందును బ్రణవవాచ్యునందుఁ గల మహిమ రామశబ్దమందుఁ గలదనియుఁ దేట తెల్లమయ్యె.

ఇట్టులే రామనారాయణ శబ్దములు సమానార్థకములు. నరుఁడనఁగా జీవుఁడు. జీవసమూహము నారము. అయన మనఁగా స్థానము. నారాయణుఁ డనఁగా జీవకోఁటికి స్థానమైన వాఁడు. అట్టులే రా యనఁగా శాల. స్థానమని యర్థము. మః= జీవులకొఱకు. అనఁగా జీవులకు స్థానమైనవాఁడు. జీవకోటి కంతయు నీయనయే యాధారమని యర్థము.

ఇట్టి భగవంతుని యనుగ్రహము సంపాదించుకొనుటకు (నమః) నమస్కారము తప్ప వేఱుమార్గము లేదని మంత్రములు చెప్పుచున్నవి. బీజాక్షరములతోడ యథాక్రమముగా మంత్ర ముచ్చరించినపుడు కొన్ని

www.mohanpublications.com

విశేషార్థములు కలుగుచున్నవి. వాని ననుసంధించుచు మంత్రముల జపింపవలయును. ఇవి స్వకుల మతాచార్యులచే నుపదేశము నొందఁదగినవి. మంత్రార్థవివరణము గ్రంథోద్దేశము కాదు. పుస్తకములను జూచి కాని, కుటిల ప్రశ్నలచేఁ గాని. యెవరికో చెప్పునపుడు తాను విని కాని, మఱుఁగున నుండి కాని, మంత్రములను నేర్చుకొని జపించిరేని శుభఫలము కలుగమి యటుండఁ బ్రత్యవాయము కూడఁ గలుగును. కావున నిజమైన శ్రద్ధాభక్తులుగలవారు తమ గురువుల యొద్ద నుపదేశము నొందవలయును. యోగ్యతలేని గురువు వలన నుపదేశము నొందిన శిష్యుఁడు బాగుపడఁడు. మహామంత్ర ముపదేశించు గురు వా మంత్రము నక్షర లక్షమార్లైన జపించియుండవలెను. శ్రద్ధాభక్తులు లేని శిష్యునకు మంత్రముపదేశించిన గురువును బాప భోజియయి తన సిద్ధియుఁ బోఁగొట్టుకొనును.

శ్లో. "యదృచ్ఛయా శ్రుతో మంత్ర, శ్ఛన్నే నాథ చ్ఛలేనవా
పత్రేక్షితో వావ్యర్థస్స్యా, త్ప్రత్యుతా నర్థదో భవేత్."

ఇది మీఁది యర్థమునే బోధించుచున్నది.

ఇఁక "రామ" యను రెండక్షరము లెచటినుండి వచ్చిననో పరిశీలింతము.

లోకమున ననేక మంత్రములు గలవు. కొన్ని వైష్ణవములు" కొన్ని శైవములు. వైష్ణవ మంత్రంబులదెల్ల నష్టాక్షరి ప్రధానము. శైవులు పంచాక్షరిని శ్రేష్ఠముగ నెంతురు.

ఓం నమోనారాయణ యనునది వైష్ణవమంత్రము

నమః శివాయ యనునది శైవమంత్రము.

మీఁది పంక్తిలోని 'రా' క్రింద నమఃశివాయలోని మః వచ్చునట్లు జదువవలయును. ఓం నమోనారాయణతో నమః శివాయ యని యుండవలయు.

అష్టాక్షరియందు "రా" ప్రధానము. ఈ మంత్రము నుండి 'రా' తొలఁగించినయెడల నాయనాయ (న+అయనాయ) మోక్షముకొఱకుఁ గాదను విపరీతార్థము నిచ్చునది యగును.

అట్లులే పంచాక్షరినుండి 'మః' తొలఁగించిన 'నశివాయ' శుభముకొఱకుఁ గాదను నర్థముగల దగుచున్నది. రెండు మంత్రములయందలి రెండు ప్రధానాక్షరములు (రా+మః) గలసి రామ యయ్యెను. ఈ కారణముచేతనే దీని నన్ని మతముల వారు శిరసావహించి గ్రహించి యున్నవారు.

అష్టాక్షరియందు "రాకారమే" యేల గ్రహింపవలయును? నాకారమేల గ్రహింపరాదు? పంచాక్షరియందు "మకారమే" యేల గ్రహింపవలయును? అను సందేహము కలుగవచ్చును. కాని యీ రెండక్షరములకుఁ గల పరస్పరాకర్షణశక్తి మఱి యెందును గానరాదు.

సాంఖ్యము చొప్పున రా యనఁగా రెండనియు, మ యనఁగా 5 అనియు మీఁదఁ జెప్పఁబడెనుగదా. రా కారము (2) పంచాక్షరిలోని రెండవ యక్షరమును నాకర్షించుచున్నది. మకార మష్టాక్షరిలోని యైదవ యక్షరమును నాకర్షించుచున్నది.

2

ఓం నమో నారాయణాయ

5

నమః శివాయ.

ఈ విధముగ రామశబ్ద మేర్పడెనందురు.

ఇఁక బ్రహ్మగతి చూడుఁడు. బకారముక్రింద రకారము హకారము క్రింది మకారము లేక బ్రహ్మకు రూపమే లేదు. కావున బ్రహ్మకు బ్రాణభూతము రామనామమే. బ్రహ్మము రాముఁడే కదా.

ఈ రెంటి యాకర్షణ శక్తి తెలుపు చిన్నకథ యొకటిగలదు. నలుఁడు సేతువు కట్టుకాలంబున సముద్రపు టలలపై నతఁడు ఱాలుగుండ్లు కొండలు గుట్టలువైన నవి బెండ్లవలెఁ దేలాడుచు నొకచో స్థిరముగ నిలువకుండెను ఇట్లు చెదిరి పోవువానిని నిలుపు సదుపాయము గానక తికమకపడుచు హనుమంతుఁ డుపదేశింప నలుఁ డొక రాతిమీఁద రా యని వ్రాసి యొక కొననుంచి మఱియొక రాతిమీఁద మ యని వ్రాసి మఱియొక కొననుంచి యీ రెంటికి నడుమ కొండలు గుట్టలు నించుచు వచ్చెనఁట. రా బండ మ బండ యొక దానియొద్దకు మఱి యొకటి రావలయునని యాకర్షించుటలో నీ రెంటికి నడుమఁ జిక్కిన శిలలు సూదంటురాతికి నినుపములికికి నడుమఁ జిక్కిన కాగిదపుఁ దునుకలవలెఁ గదలక నిలిచెను.

ఈ రెండక్షరములయం దిట్టి మహిమ గలదని యెఱిఁగియె భగవంతుఁడైన వసిష్ఠుఁడు దశరథనంద

www.mohanpublications.com

నునకు నవతారమూర్తికట్లు నామకరణముఁ గావించెను. వసిష్ఠుఁ డంత తెలిసినవాఁ డైనచోఁ బట్టాభిషేకమున కేల యట్టి పిడుగువంటి ముహూర్తము నేర్పాటు చేసెనని యందురేమో. వషిష్ఠుఁడు తెలియక చేసిన పనిగాదు. అవతార ప్రయోజనముఁ దెలిసియే యట్లు చేసెను. దీనిని భోజరా జిట్లు చెప్పియున్నాఁడు.

శ్లో. కాంతార కంద హననం రచయేతినూన
మా బద్ధనాన్ ప్రతిసరం భగవాన్ వసిష్ఠ.

కాంతారకందహననము చేయుమని వసిష్ఠుఁడు శ్రీరాముని హస్తమునఁ గంకణముఁ గట్టెనఁట. కాంతారకం దహనన మనఁగా నడవియందుఁ గందలు త్రవ్వి జీవింపుమని యొక యర్థము. ప్రియురాలిని నపహరించిన వానిని సమూలము నాశము చేయుమని రెండవ యర్థము.

రామశబ్దోచ్చారణమందుఁ గల విశేషమును బరికింపుఁడు. 'రా' యనఁగానే పెదవులు తెఱచుకొనును. మ్ (మకారము) అనఁగానే తలుపులవలెఁ బెదవులు మూసికొనును రా యనఁ గానే పాపములన్నియు శ్వాసముతో పాటు వెలుపలఁ బోవును. మరల నవి లోపలికి రాకుండుటకై మకారోచ్చారణము చేతఁ బెదవులు మూసికొనును.

శ్లో. రేఫోచ్చారణ మాత్రేణ, బహీ ర్నిర్యాంతి పాతకాః
పునః ప్రవేశ భీత్యాచ, మకారస్తు కవాటవత్.

వాల్మీకి రచిత శ్రీమద్రామాయణ మైహికాముష్మిక ఫల ప్రదమనుట సుప్రసిద్ధము. "సంతతి సంపద్రా మాయణత" యను నార్యోక్తిగలదు. దానికిఁ గారణమేమన. ర కార మగ్ని బీజము శ్రియ మిచ్ఛేత్ హుతాశనాత్తని ప్రమాణము. సంపద గోరు వా రగ్ని దేవునిఁ బూజింపవలయును. అట్టులే మకారము లక్ష్మీబీజాక్షరము. కావున రామశబ్ద జపము సంతతి సంపత్ప్రదము. ఇది గాక రామ మంత్రమునకు బీజవర్ణమైన రాంకారము దీర్ఘాయుష్యప్రదమని శ్రీరామ కవచంబునఁ గలదు.

శ్లో. మకారస్య ఋషిర్భర్గః, ఛందోనుష్టుప్ ప్రకీర్తితః
రమా బీజ మితిఖ్యాతం, ధనదంచ జయప్రదమ్.

ఇదిగాక రకారము శత్రుసంహారకారి. రకారము విధి చొప్పున జపింప నది యెట్టి శత్రువునైన ధ్వంసము సేయును. కావుననే శత్రుసంహారమైన రామాయణ చరమశ్లోకంబున రామశబ్దమే ప్రయోగింపఁబడినది. రామశబ్దమందొక సౌలభ్యము గలదు. ప్రణవోచ్చారణమునకు హీనజాతుల వా రధి కారులుగారు. రామనామోచ్చా రణమున కెవ్వఁడైన నధికారియే.

ప్రణవవాచ్యుని యథాస్థితిఁ జూచినవారు తెలిసినవారు లేరు. కావున దేవతలుగూడ నవతారమూ ర్తినే భజింతురు.

శ్లో. "భవతో యత్పరం రూపం, తన్నజానాతి కశ్చన,
అవతారేషు యద్రూపం, తదర్చంతి దివౌకసః. ని. పు.

ఇందొకటి యెక్కువ యని మఱియొకటి తక్కువ యని భ్రాంతులు తలఁతురు. ఎవరి కెంతశక్తి తానిచ్చెనో యంతశక్తి నిర్వంచనముగాఁ దనవిషయమై వినియోగించుచున్నాఁడా లేదా యని రాముఁడు చూచునేకాని వానరులవలె మహాపర్వతము తేలేదని యుడుతను దృణీకరింపలేదు. ఏండ్లకొలఁది సమాధిలో నుండలేదని శబరిని నిర్లక్ష్యముగఁ జూడలేదు. ఇట్టులే ద్రౌపదీ కుచేలాదుల చరిత్రములు, స్మరింపుఁడు. భగవంతునకంటె భగవన్నామము బలిష్ఠము. ప్రహ్లాద ద్రౌపదీ హనుమంతుల చరిత్రములు దృష్టాంతములు.

ఏది వ్రాయఁబూనినను దొలుత మనవారు శ్రీరామ యని వ్రాయుటయు, నేఁడు శ్రీరామ యని మూఁడక్షరములు వ్రాయలేదనుటయు నాలోచించిన రామనామమునకుఁ గల ప్రఖ్యాతి వ్యాప్తి తెలియనగు.

కొన్ని దేవాలయములందు 'శ్రీరామ' యను నక్షరముల వరుస ననుసరించి సీతారామలక్ష్మణులు గానవత్తురు. వీరు భుక్తి ప్రదులు. ఈ గ్రంథాదియందు ముద్రింపఁబడిన పటమున రామ సీతా లక్ష్మణులు గానవచ్చుచున్నారు. క్రింద అ ఉ మ యను నక్షరములు గాననయ్యెడి. ఇది యేమి వరుస? అర్థమేమి? యని కొందఱు సందేహింతురు ఈ వరుసకు దాని యర్థమునకు శ్రీమద్వాల్మీకి రామాయణమే ప్రమాణము.

శ్లో. "అగ్రతః ప్రమయౌ రామః, సీతా మధ్యే సుమధ్యమా
పృష్ఠతస్తు ధనుష్పాణి, ర్లక్ష్మణో నుజగామహ" అర. 111

ముందుగ రాముఁడును, నాయనవెంట సీతయు నామె వెంట ధనుర్బాణధారియై లక్ష్మణుఁడు పోయిరి. ఇంతకుఁ బూర్వము ముందు లక్ష్మణుఁడును, నాయన వెనుక సీతయు, నిరువురకు రక్షకుఁడై వెనుక రాముఁడును బోవుచుండిరి. రామావతార మనుష్యాత్మ నవతారమే కాని కృష్ణావతారమువలె నాచార్యావతారము కాదు. త్రేతాయుగంబున నొక పాదమే ధర్మము లుప్తమగుట లోకులు సదాచారపరుని జూచి తమ నడవడి

www.mohanpublications.com

సవరించుకొనఁ గలవారై యుండుటకు మాయామానుషావతార మగుటకు శ్రీరాముఁడు నిజపరతత్త్వమును బ్రకటించుకొనక తన నడవడిచేతనే లోకులకుఁ దత్త్వ ముపదేశించుచుండెను. తమకుఁ గల ధర్మసందేహములను ఋషులుగూడ రామువలననే నివర్తింపించుకొనుచున్న వారగుట వీరి గమనము నర్థమున సందేహము జనించి తపస్వులు ప్రణవార్థము బోధింప నడగిరి. అప్పుడు పూర్వపు వరుస మార్చి ముందు తానుబోయి. తన వెనుక సీత యామె వెనుక లక్ష్మణుఁడు వచ్చునట్లు చేసెను. అదియే ప్రణవార్థమనియు లక్ష్మణునివలె దాస్యము చేయుటే తరణోపాయమనియు వారు గ్రహించిరి. రాముని ధనుర్బాణములు సీతాదేవి వస్త్రాభరణములు మోచికొని వచ్చుట దాస్య లక్షణము. అదిగాక నేను రామునకు దాసుఁడనని లక్ష్మణుఁడే చెప్పెను గదా.

ఉత్తరముల వక్కణమునందుఁ దొలుత మహారాజశ్రీయని వ్రాయుదుముకదా. అందేమి విశేషము. విలోమముగఁ జూడ శ్రీరామయని యుండుటయే విశేషము. మహా+రాజ+శ్రీ.

మహారాజరాజశ్రీ యనునపుడు నది బీజాక్షర యుక్తమై కానుపించు. మ॥ రా॥ శ్రీ. మ–రా–రా–శ్రీ యనునవి వాని సంక్షేపరూపములే కదా.

కేవల రామశబ్దమునందే మీఁద వివరించిన మహిమ యుండినను దానిని శ్రీకారపూర్వకముగ జపింపవలయును. వ్రాయవలయును. ధ్యానమునందును గేవల రామమూర్తిని స్మరింపరాదు.

శ్రీసీతావిశిష్టుఁడైన శ్రీరామమూర్తిని గనుటకెదుర గోచరింపఁ జేసికొనుచుండవలయును. సీతను విడిచి రాముని మాత్ర మాశ్రయించినవాఁడు శూర్పణఖవలెఁ జెడును. రాముని విడిచి సీతమాత్రము సేవించిన రావణునివలె నగును.

కం. శ్రీ రామరామ యనుచును
సారెకు నీ నామ జపము సన్నుతలీలన్
గోరి పఠించిన వారికిఁ
జేరువ కైవల్య పదవి శ్రీరఘురామా.

యనుట యెంతసత్యమో యిప్పుడు తెలియనయ్యెఁగదా.

తక్కిన యందఱు దేవతల కంటెను సీతారాములు బహుసులభులు. వారిని సంతోషపఱుపఁ గానుకలు బలులు సమర్పింప బనిలేదు. వారి నుద్దేశించి తపములు, వ్రతములు, యజ్ఞాదులు చేయవలసిన పనిలేదు. స్మరణమాత్ర సంతుష్టుఁడని శ్రీరామునకు బిరుదు "ప్రణిపాత ప్రసన్నాహి మైథిలీ జనకాత్మజా" యని వాల్మీకి చెప్పినట్టు లొక సాష్టాంగ నమస్కారముచేఁ యొకసారి ప్రపన్నుఁడైనవాని నెట్టివానినైన నెవ్వనినైనను దోషయుక్తుఁడైనను రక్షించుట నావ్రతమని శ్రీరాముఁడు వచించెను. లోకములో నపరాధము చేయనివాఁడొకఁడైన నుండడు కావున నపరాధుల శిక్షింపఁ బూనినచో రక్షింపఁ దగినవాఁ డొక్కఁడు నుండఁడు. రక్షించుట కర్తవ్యము గాని శిక్షించుట గాదు. కావున నే నెవరిని శిక్షింపను. అందఱ రక్షింపుమనియే సీతాదేవి హనుమంతునితోఁ జెప్పెను. ఇంతకంటె సులభసేవ్యు లెవ్వరు గలరు? వారిపేరు స్మరించినంతనే వారు వశులగుదురు. "కరుణాకాకుత్స్థ" యని కదా పెద్దలు కీర్తించిరి.

శ్రీ రామ రామ రామ యనుటకు దుడ్డుదుగ్గాణి వెచ్చ పెట్టఁ బనిలేదు. కాయకష్టము పనిలేదు. ఉచ్చారణ కష్టము లేదు. దీని నుచ్చరించు నాలుక మన యధీనమం దున్నది. ఇంత సులభముగ నుండియు జనుల పాప మెట్టిదో వారి వ్యసనాభి ముఖ్య మెట్టిదో యది నాలుకకు రాదు. నూఱు దున్నపోతులను గడిగెదనుగాని యొక పాలగ్రామము కడుగలే నన్నట్టు రాత్రి పగలు విసుఁగు లేక యిరుగింట పొరుగింట పురాణములు లోకవార్తలు ప్రొద్దుపోని ముచ్చట లెన్నియైన మాటలాడుదురు గాని రామ రామ యనఁజాలరు. పదిమార్లైన రామయని వ్రాయఁజాలరు. శ్రీమద్రామాయణమున నొక పద్యమేనిఁ జదువఁజాలరు. పాప మెంత బలిష్ఠమో!!

శ్లో. సుగమం భగవన్నామ, జిహ్వాచ వశవర్తినీ
తథాపి నరకం యాతి, ధిక్ ధిగస్తు నరాధమాన్

అని మనుష్యాధములఁ గూర్చి పురాణములు శోకించుచున్నవి.

శ్రీమద్రామాయణమున ఫలశ్రుతిని వాల్మీకి యిట్లు వ్రాసియున్నాఁడు.

సీ. ఆఖ్యాన మియ్యది యాయుష్కరంబును
బాపనాశకము సౌభాగ్యకరము
నామ్నాయ సమము రామాయణంబియ్యది
శ్రాద్ధకాలంబుల శ్రావ్యమగును

